# పూలు పాలు

స్థానాపతి రుక్మిణమ్మ

విశాలహృదయులగు
తెనుఁగుతోఁబుట్టువులకు
భక్తిపూర్వకముగ
అంకితము

# పీఠిక.



స్థానాపతి రుక్మిణమ్మగారి వయస్సు పదునెనిమిదేండ్లు. ఈమె విద్యాశాలలందుగాని, పండితగురువుల సాన్నిధ్యమున గాని విద్య నభ్యసించియుండలేదు. స్వయంకృషివలనను, భర్తృసహవాసమునను సేకరించిన పూలతో నీ 'మాల' గ్రుచ్చినది. నిరర్థకములగు నాచారములతోను, నీరసములగు శాకపాకములతోను నానాటికి శుష్కించిపోవుచున్న తెనుగు సంసారమున మరల సరసములగు నూతననిబంధనలతో సాహిత్యము మొలక లెత్తుచుండు టెవ్వరి కానందహేతువు కాదు?

ప్రథమప్రయత్న మయ్యు, నీ కావ్యగుచ్ఛమునం దచ్చ టచ్చట విరళముగా నుత్తమకావ్యనిర్మాణమునకు వలయుసామగ్రి కాన్పించుచునేయున్నది. ఎచ్చటను స్థాయిఁ గానక నానామార్గములు త్రొక్కుచున్న నేటికవులరచనల యందుకన్న, పూర్వకవుల రచనలయందే రుక్మిణమ్మగారికి

పక్షపాతము మిక్కుటమని పాఠకు లెఱుంగగలరు. ఈమె "మొల్ల, తరికొండ వెంగమ్మ, ముద్దుపళని" వలెనే "సుధాస్యంది లేఖినితో" నవ్యయానంద కందము లగు కావ్యముల నిర్మించి యాంధ్రుల మన్ననలకుఁ బాత్రురా లగుగాకయని నాయాశీర్వాదము.

విశాఖపట్నము,
౬ — ౧ — ౩౮.

అబ్బూరి రామకృష్ణరావు.

# మనవి.



ఇందలి పద్యములు ‘భారతి’ ‘గృహలక్ష్మి’ ‘ఆంధ్రభూమి’ పత్రికలయందుఁ బ్రకటింపఁబడెను. ఇప్పుడివి పుస్తకరూపమును దాల్చినవి. నా యీ పద్యములను తమతమ పత్రికలలోఁ బ్రచురించి వ్రాయుటయం దుత్సాహముఁ గలుగఁ జేసిన ఆ యా పత్రికాసంపాదకుల కెంతయుఁ గృతజ్ఞురాలను.

నిర్దుష్టముగఁ గవన మల్లుటయందు నా కిది ప్రథమప్రయత్నము. అందును శాస్త్రజ్ఞాన మల్పము. అందువలన నిం దేవేని దోషములు దొరలియుండి యుండవచ్చును. కావున దయార్ద్రచిత్తు లగు పండితులు వానినిఁ బరిహరించి నాయల్పజ్ఞత్వమును మన్నింతురుగాక! భాషాసంబంధ సవరణలు కొన్ని సూచించి, దయతో ‘పీఠిక’ వ్రాసి దయచేయించినవారును, ఆధునికాంధ్రవిఖ్యాత కవులును, గురుసమానులును అగు మహారాజశ్రీ అబ్బూరి రామకృష్ణరావు, బి. ఏ., గారికి హృదయపూర్వకవందనశతము లర్పించుచున్నాను.

'చందమామ' 'నిరాసము' 'ఆంధ్రభూమి' నా సొంతములు. 'గుమ్మడు' తెనుఁగు గేయమునుండియు, 'పతిసందర్శనము' భాసుని (మధ్యమవ్యాయోగము) పాండవ వనవాసము నాటకమునుండియుఁ గ్రహింపఁబడినవి. తక్కినవి కొన్ని యనువాదములు, కొన్ని ఆయాగాథలలోని భావముమాత్రము గ్రహించి మార్చి వ్రాయఁబడినవి.

విశాఖపట్నము,
౮ – ౧ – 3౮.

స్థానాపతి రుక్మిణమ్మ.

# విషయములు.







# పూలమాల

## కాత్యాయని

శ్రీమ దోంకారపంజరాసీనశుకము
ప్రాంచదుపనిషదుద్యానపరభృతమ్ము
ఆగమారణ్యవీథీమహామయూర
మైన కాత్యాయనీ దేవి నాత్మఁ దలఁతు.

## చందమామ

నెలకుఁ బదునైదురోజులు నెయ్య మలర
దినదినమ్మును దూరుపుదిక్కునుండి
చిమ్మచీఁకటి తెరలను జీల్చుకొనుచుఁ
బాలవెన్నెల నిగ్గుల బయలువెడలి
వెండిమేఘాల మేడల వీథు లంటి
అమృతవర్షమ్ముఁ గురియుచు నరుగునిన్ను
"దాయి! దాయి! జాబిలి! రావె! దా! యటంచు
చనవుగాఁ గరయుగమును జాచి చాచి
దవ్వులన్ నిల్చి నా చెల్లి నవ్వి పిలువ
'దాగురుమ్మూత' లాడుచు తరుణకిరణ
కరయుగ మ్మెత్తి ముద్దాడి కౌఁగిలించి
చుక్కలే తప్ప నితరము జోడులేక
మల్లెపూఁదోట తిరుగాడు మాలివోలె
చల్లగా నెటుపోదువో చందమామ!

# పూ ల మా ల

## చా టిం పు

పూర్వ మొక రాజు తనపట్టణములో రాత్రులందు గస్తు దిరుగుటకు నొక తలారిని నియమించెను. ఆ తలారి కేదో కార్యాంతరనిర్బంధ ముండినందున నాయూరిపక్క పొలములో నిద్రపోవుచున్న జడభరతు నెవ్వరో యనుకొని తీసికొనివచ్చి తనకార్యమున కాతని నియమింపఁగా నతఁడు:—

౧ - వ జామున

ఆశచే బద్ధ మయిపోయె నఖిలజగము
వింతగా కర్మలఁ బహుచింత లొదవు
తరుగుదినము - నాయుఃక్షీణ మెఱుఁగ దహహా!!
కాన జాగర్తి! జాగర్తి!! కాచుకొనుఁడు.

౨ - వ జామున

క్షణము చిత్తమ్ము, విత్తమ్ము క్షణమె సుమ్ము
క్షణము జీవిత మెల్లను, క్షణము: నటన
ఎఱుక తెలియుఁడు యమునకుఁ గరుణ లేదు
కాన జాగర్తి! జాగర్తి!! కాచుకొనుఁడు.

3 - వ జాముస

లేరు తల్లిదండ్రులు లేదు - లేదు - బంధు
వర్గము; సహోదరులు లేరు వసతి లేదు
తలఁప నిర్యోడ సుం తైన ధనము లేదు
కాన జాగ్రత్త! జాగ్రత్త!! కాచుకొనుఁడు.

౪ - వ జాముస

జ్ఞానరత్నమ్ము హరియింప మేనియందు
కామలోభాది దుష్టతస్కరులు సతము
వేచియుందురు మూలల వివిధగతుల
కాన జాగ్రత్త! జాగ్రత్త!! కాచుకొనుఁడు.

# పూ ల మా ల

## ని రా స ము

తెలుపఁగారాని యానందజలధి మునిఁగి
పొందుగా గ్రుచ్చి చేమంతిపూలమాల
కాంతుతోడుత భవదీయగళముఁ జేర్పఁ
దిరుగునంతలో ముఖ మటు త్రిప్పినావు
సర్వము సమానము గద! విశాలమతికి
దేవి! కోపకారణ మేమొ? తెలియరాదు.

# పూ ల మా ల

## క వి త

అమలభోగైకవిశ్వంభరాధిపతికి
కలిత మాతంగ సైంధవోత్కరరథాది
భట సహస్రమ్ము లెన్నని వఱలనిమ్ము
కవిత లేకున్నఁ గీర్తి నిక్కముగఁ గలదె?

అంధుఁ డారయఁ గమలపత్రాక్షుఁ డనియుఁ
బరమకృపణుండు సంతానతరు వటంచు
భీరు వెంతయు శౌర్యగంభీరుఁ డనుచు
ఖ్యాతిఁ గాంచుట కవికృపాకలనఁ గాదె?

అన్యదేశాల సంచార మన్యదాస్య
మొక్క భార్యకు నేవురు నొప్పుమీర
భర్తలై పాండవులు కీర్తిఁ బ్రబలియుంట
వ్యాసకవిసార్వభౌము నిర్వ్యాజకరుణ.

సూర్యచంద్రులు బ్రహ్మాదిసురవరేణ్యు
లాదిమధ్యాంతరహితుఁడౌ యాపరాత్ప
రుండు దేని గాంచఁగ లేరొ రూఢిఁగాను
కవి మహాత్మకుఁ డద్దానిఁ గాంచు జగతి.

# పూలమాల

ద్వివిధ మీ గోచరించెడి విశ్వ మెల్ల
నామరూపాత్మకం బని నవ్యఫణితి
నామలోకంబు నిర్మించినాఁడు కవియె
ధాత రూపాత్మజగతినిర్మాత యయ్యె.

మొల్ల తఱిగొండ వెంగమ్మ ముద్దుపళని
ఆచ్చమాంబయు మొదలుగా నాంధ్రమహిళ
లమితవిఖ్యాతిఁ గాంచు టీ యవనిలోన
కమ్రకవితామృతాస్వాదకలనఁ గాదె?

గు మ్మఁ డు

రాణించు ముత్యాల రావిరేకయు బొట్టు
నిరువైన కురులలో మెఱయుచుండ
బాగైనవజ్రాల పౌజులకమ్మలు
తళుకుచెక్కిళ్లపైఁ దాండవింప
వక్షస్థలమ్మున బలితంపునునుజిగి
ముత్యాలహారముల్ మురిసియాడ
వెలలేని రతనాల నలరారు బహువిధ
కరకంకణమ్ములు ఘల్లురనఁగ
నలరి, త్రాఁడు కవ్వంబున కమరఁ జుట్టి
వల్లెవాటగు పయ్యంట యొల్లెయాడ
వనిత యొయ్యారమునను బ్రభాతవేళ
పెరుగువడి ఘుమ్మ్ఘుమ్మనఁ దఱచుచుండ

నాద మటు విని కృష్ణుండు నవ్వుచు దరిఁ
జేరి తక్కుచు నడుమునఁ జేయి నునిచి
'అమ్మ! వెన్న! వెన్నో!' యంచు నెమ్మితోడ
నడిగి తడయక కవ్వమ్ము నణఁచిపట్ట.
అల నిలింపపుష్పామోద యాయశోద
రట్టుఁ జేయు పుత్త్రుని భయపెట్టఁదలఁచి

'అరయు మీఁభాండమున గుమ్మఁ డనెడుబూచి
తిరుగుచున్నాఁడు చెయివెట్టఁ గఱచునమ్మ!'
అన విని మందహాసవద
నాంబుజుఁ డౌచు మురారి తొల్లి నే
వినుకలిగా శతాకృతుల
వేడ్కఁ ధరించి భయంకరోగ్రులౌ
దనుజులఁ గల్మషాత్ములఁ
దాల్మి వధించి సమస్తలోకముల్
గొనకొని సంచరించితిని
గుమ్మఁ డటన్న విచిత్రమయ్యె; నెం
దును గనఁజాల నిప్పు డెట
దోఁచెను చూపఁగదమ్మ మ్రొక్కెదన్.
అనుడు యశోద విస్మయము
నంది కుమారు ననంతమూర్తి గాఁ
గని పెనుమాయలోఁ దగిలి
కన్నుల బాష్పకణాళి గ్రమ్మ కృ
ష్ణుని వడి నెత్తి ముద్దుగొని
సూటిగ 'గుమ్మఁడు' పోయె నంచు వె
న్న నిడి నయంబునం బనుప
నవ్వుచు నేగె రయాన వెన్నుఁడున్.

# పూలమాల

## దశావతారములు

వేదాదివిద్యలు వెలయింపఁగాఁజేసి
ముదము మీరఁగ లోకములు వహించి
భూగోళ మెల్ల విస్ఫూర్తితోఁ బైకెత్తి
ఘనదుర్మదాంధు రక్కసునిఁ దున్మి
బలిచక్రవర్తిని పాతాళమునఁ గట్టి
క్షాత్రమండలమును క్షయ మొనర్చి
నిశితమార్గణపంక్తి దశకంఠుని జయించి
కమనీయమైన నాగలిని బట్టి
ఇంపు దళుకొత్త కరుణ వ్యాపింపఁజేసి
భువనకీర్తిగ మ్లేచ్ఛుల మూర్ఛ ముంచి
అతులమతిని నివ్విధి దశాకృతులఁ దాల్చి
మహిని దనరారు శ్రీకృష్ణు మదిఁ దలంతు.

## పూలమాల

సకలావనీచక్రసంస్తూయమానమై
యలరు కాశిపురి నవతరించి
అతిబాల్యమందె యశ్వారోహణాదుల
పేరు కెక్కినయట్టు లారితేరి
జయ జయ ధ్వనులతో ఝాన్సీమహావిభుఁ
బ్రేమ మీరంగను బెండ్లియాడి
ఖడ్గప్రహార విఖ్యాత పాండిత్యంబు
భువి వైరివరులకుఁ జవులు చూపి
వీరలోకమ్ముఁ జొచ్చిన వీరబాల
లక్ష్మిబాయిని సతమీ యిలాతలాన
భరతవనితల హృద్వీథిఁ బ్రబలుచుండ
ముదముతోడుతఁ జేమోడ్చి మ్రొక్కుదాన.

పదియును రెండురోజులు వి-
పక్షుల భీకరసేన లన్నిటికిన్
బదిలము గాగ నెవ్వరి యు-
పాయసహాయము లేమి నొందకే

కదనవిలాసమందిరము
ఖంబునఁ జంపితి వీవు బాలవై
యెద కురుపాండవాహవ మ
దేడని లోకము లుల్లసిల్లఁగాఁ.

విరివిగ కోపచిత్తులయి
విప్లవకారులు హూణరాజులన్
దరుముచుఁ జంపుచుండిన వి
ధమ్మును గాంచి కృపారసమ్ముతో
శరణ మొసంగి రొట్టెలను
జాలఁగ బెట్టియుఁ గాచినట్టినిఁ
దురమున నుగ్రఖడ్గముల
దున్నఁగడంగిరి పాపు లక్కటా.

తురఁగము నెక్కి నీకొమరుఁ
దోడ్కొని సాంద్రమహాటవిభయం
కరఘనదుర్గమార్గముల
ఖడ్గసహాయమె పూని పోవు ని

న్నరసి వధింపవచ్చు నహీ
తాళిని జంపుచు 'కాల్పి' * జేరితే
యిరువదినాల్గుగంటలకు
నెంతయునూఱును రెండుమైళ్లహో !

రణశిక్షణము లాదిరాజ్యతంత్రంబులు
రావుసాహెబునకు రహిని దెలిపి
బాందాయు రోహిలా బంగాళ బుందేలి
సేనల వేగమే చేరఁగట్టి
పరిపంథిహృదయముల్ భగ్నమౌనట్టుల
తురగ వారమ్ముతోఁ దొలుత నిలిచి
తతవైరిభూరిశతఘ్నికాళికి జంకి
వెనుచను వీరుల వెఱపు మాన్పి

హయ మధిష్ఠించి ధట్టించి హుంకరించి
కళ్లెమును నోటితో బట్టి 'కాల్పిలోన'
సవ్యసాచితభయదవిస్తారహనన
కర్మ శత్రు నోడించునిఁక గూర్మిఁ దలఁతు.

* ఒకపట్టణము.

## కుంతీసందేశము

కలుషపు జూదకార్యమునఁ
గాసిలి రాజ్యపదచ్యుతిన్ యశః
కలనము లేక వైభవసు
ఖమ్ముఁ దొరంగియు జ్ఞాతిహేళనో
క్తులకుఁ గృశించి దైన్యమున
ఘోరవనాంతరవాసు లౌటచే
తొలి విలపించి మాధవుని
తోఁ దెగువాడితిసుమ్ము ధర్మజా!

పదివేలేన్గులతో సమానబలమున్
బ్రఖ్యాత శౌర్యాది సం
పదలన్ గ్రాలెడు భీమసేనుఁ డకటా!
ప్రాణావశిష్టుండు నై
పదుమూఁడేండ్లు వనమ్ములన్ దిరిగెనే
ప్రారబ్ధమో యంచు మున్
గదనోత్సాహము పుట్టఁగాఁ బలికితిన్
గాలానుగుణ్యంబుగన్.

భయదశాత్రవమథనుఁడీ పార్థుఁ డెలమి
పార్వతీశుని మెప్పించి పాశుపతము
వడసి కారడవులఁ బడి బడలిపోయి
వగలఁ బొగులంగఁ జూచి యే తెగఁబలికితి.

అతిసుకుమారులు పిన్నలు
మతిమంతులు గతపితరులు మాద్రితనయుల్
ధృతి చెడి పేరాకలిచే
సతము కృశింప న్నొడివితి సంగ్రామవిధుల్.

భీష్మాదిగురువృద్ధవీరపాలిత మైన
సభయందు తులువ దుశ్శాసనుండు
ద్యూతాపహృతరాజ్యదుఃఖాబ్ధిలో మున్గి
దరిఁ గానకున్న మీదరికి నాఁడు
పెన్నడవుల్గు నాఁ గన్నుల బాష్పముల్
నించి ఘోరున విలపించుచుండ
స్త్రీధర్మిణియు యువతీలలామయు నైన
పాంచాలిచికురముల్ పాయ దిగిచి

# పూ ల మా ల

బలిమిమై నీడ్చి పరిపరి పరిభవించి
వెతలపాల్సేయుచుండిన విధముఁ గాంచి
ధార్తరాష్ట్రుల కిఁకఁ జావు తప్ప దనుచు
నతులసంగ్రామసందేశ మంపినాను.

వివిధధర్మోపదేష్టలౌ విదుర కేశ
వాది మహనీయవాక్యాళి ననుసరించి
విమలభవదీయ తేజోవివృద్ధికొఱకె
కలుగఁజేసితి నవ్వేళ కదనబుద్ధి.

ప్రథితపాండుభూవరకుమారకులు మీరు
దాస్యశృంఖలాబద్ధులై తల్లడిలుట
కాంచి సైరింప నోపక కదనరంగ
విధుల బోధించితిని గాని వేఱుగాదు.

అవిరళ నిత్యభోగ విభ
వాతిశయోల్లసితుండు పాండుపా
ర్థివు పరిపాలనమ్మునన న
తీత మహోజ్జ్వల రాజ్యసంపదల్

## ఫూలమాల

దవిలి భుజించి శాస్త్రవిధి
దానములన్ బరమేశుతృప్తికై
దివిజనుతమ్ముగా నెఱపి
దీప్తిని బొందితిఁ జాలు ధర్మజా!

ఇటుపై సాంద్రతపోవనాంతరమునం
దేకాగ్రచిత్తంబుతో
జటినై ఘోరతపం బొనర్చి తనువున్
జాలించి నా నాథుఁ డే
స్ఫుటపుణ్యార్జితలోకమందుఁ గలఁడో
శోధించి నే నాస్థలిన్
దిటమై పొంది సుఖింతుఁ గాని వల దీ
తీక్ష్ణోరుసామ్రాజ్యముల్.

కాన నా వనవాసదుఃఖమును విడిచి
భీమసేనాదు లనుజులు పేర్మిఁ గొలువ
చతురుదధి వలయిత ధరాచక్ర మెల్ల
ధర్మమున నేలుకొనుమోయి ధర్మరాజ!

## కృష్ణునితో పాంచాలి

అది ఉపప్లావ్యము. పాండుపుత్త్రులసందేశమును గొని కృష్ణభగవానుఁడు రాయబారిగ కౌరవసభకుఁ బయనమగుచున్నాఁడు.

సంధిప్రస్తావమున 'సంక్షుభితహృదయయై అశ్రుపూర్ణనయనములతోఁ బరాభవమునఁ బ్రతిహింసకై రోజాకాలభుజంగసన్నిభమగు కుంతల కలాపమును చేఁబూని కంపితగాత్రముతో నెదురునిలిచి కృష్ణునితో పాంచాలి:—

నిలువు మోయన్న, మాధవా ! నిలువు మొక్క-
సారి పగవారితో సంధిజరుపువేళ
దుస్ససేనుని వ్రేళ్లచేఁ దునియలైన
యీచికురశేష మింత స్మరింపవేమి ?

## పూ ల మా ల

చంపఁగూడనివారినిఁ జంపుఁ టెంత
పాపమో! యంతకంటెను బదియురెట్లు
చంపుటకుఁ దగువారినిఁ జంపకుండ
విడిచిపుచ్చిన పాప మేర్పడదె? కృష్ణ!

పలుకష్టములఁ గూర్చి పగఁబూని బాల్యమ్మ
నందుఁ బెట్టినవిషాన్నంబుమాట
కాశికాపురి కంపి కరుణావిహీనులై
యింటికప్పునకుఁ జిచ్చిడినమాట
మాయజూదమున సామ్రాజ్యమును హరించి
యడవులపాల్జేసినట్టిమాట
దండిమగల్గల నిండుసభకు నీడ్చి
నా చీర లొల్చిననాఁటిమాట
మఱచి భీమార్జునులు సిగ్గుమాలి నేఁడు
దీనతం జూపి సంధికై దేవురింప
నిశ్చయించిరి; యయినఁ గానిమ్ము నాకు
నంతమాత్రిన లోటిసుమంత లేదు.

# పూ ల మా ల

అతివృద్ధుండగు నాదుతండ్రి నిజపు
త్త్రానీకముఁ గూడి యు
ద్ధతి యుద్ధం బొనరింప వైరికృతమి
థ్యావాద మూహించి క్రు
ద్ధత నా యేవురుపుత్త్రులున్ సమరవి
ద్యాశాలి సౌభద్రునా
నతి శత్రుక్షయమున్ బొనర్తు రెలమిన్
నానారణక్రీడలన్.

పుట్టితి నగ్నికుండమునఁ
బుత్రికనై ద్రుపదాధినేతకుఁ
మెట్టితి కుంతికోడలుగ
మేలగు నీభరతాన్వయమ్ముఁ జే
పట్టితి ధర్మమూర్తులగు
భర్తలఁ గొంటిని నీతిధైర్యస
మ్రాట్టులఁ బుత్రులన్, మఱియు
మాసహజన్ములప్రాపు నొందితిన్

పూ ల మా ల

ఇన్నిట వన్నెఁగాంచు నను
        నీవు సతమ్ము సుభద్రకంటెనుఁ
మన్నన గారవింతు విను
        మా యిఁకఁ జెప్పెద నట్టి - నన్ను - నే
మున్నది - కౌరవుల్ సభకు
        నూరక యీడ్చియు దాసిఁ జేసి; రా
బన్నము నెవ్వ రోర్తురొకో ?
        భవ్యచరిత్ర ! వచింపు కేశవా !

ఓ వనమాలి ! నా మనవి
        నోర్మి సహించి గ్రహింపు "రాజసూ
యావభృథమ్మునందు వసు
        ధామరమంత్రపవిత్రవారిధా
రావళిఁ జేసి పావనము
        లై నశిరోజములన్ గ్రహించె" పా
పావహుఁ డట్టి దుర్జనుని
        హా స్తశిరమ్ములు పోర వ్రిక్కలై
పోవలె ధూళిలోఁ బొరలి
        పొందుగ నామన మప్డు శాంతిలుఁ.

# పూలమాల

అతిభయంకరోదగ్రదావాగ్ని భాతి
పరిజ్వరిల్లు మత్క్రోధమ్ముఁ బలిమి నణఁచి
ఎటులో బ్రతికితిఁ బదియుమూఁడేఁడు లిపుడు
వచ్చెను పదియునాల్గవవత్సరమ్ము
కాని; కోపమునకు శాంతి కానరాదు.

అదియునుగాకీ భీముఁడు
పదపడి యిపు డేయువాక్యబాణములకు మ
ద్ధృదయము ధృతిచెడి శతధా
విదళిత మయ్యె నకటా...

# పూలమాల

## సుమన: శాండిలి

శుభవిమానాస్థయై సదా సొంపు మెఱయ
త్రిభువనంబులయందును దిరుగుచున్న
శాండిలిని గాంచి యిట్టుల సరవి నడిగె
పుణ్యచారిత్రి కేకయపుత్రి సుమన

ఏ యే పుణ్యవ్రతముల
నే యే యాచారములను నే యే కథలన్
న్యాయము వీడక నిరతముఁ
బాయక యొనరిచి యడంచి పాపముల వడిన్.

సర్వతత్త్వజ్ఞత సర్వవిజ్ఞానంబు
గలిగి యాస్వర్గలోకంబు పొంది
ఆజ్యాహుతిం గొన్న యగ్నిహోత్రిము భాతి
నిమ్ముగా దేహ తేజమ్ము వెలుఁగ
నగణిత దివ్యభూషాంబరమ్ములు దాల్చి
యెందును శ్రమసుంత నొందకుండ
సంచరించుట వివరించి చూడగ నల్ప
తపములఁ గా దల్పదానములను

గాదు కాన; నెట్లొందితో కరుణ దనర
నూటిగాఁ జెప్పు మన నంత సుమనతోడ
శాండిలి మొగమ్ము చిఱునవ్వు మొందుకొనఁగ
నిట్టు లనె మాటలను తేనె లుట్టిపడఁగ.

జడలు వల్కలములును గాషాయవస్త్ర
తతి మొదలగున వెవ్వియుఁ దాల్చకుండ
నతులఘనశాశ్వతానంద మై తనర్చు
చెలియ! దేవత్వ మొందితిఁ జెప్పెద విను!

భర్త్రాజ్ఞ బాగుగాఁ బాటించి, కలనైనఁ
బరుషోక్తి లవమును బలుక, కెపుడు
దేవతాద్విజపితృదివ్యపూజలు చేసి,
యత్తమామలయెడ బత్తి దగిలి,
పై శూన్యమును వీడి, పరు నెదఁ జొరనీక,
ద్వారమ్ముకడ నిలువఁబడక, పని
మాలి సవ్వక, గూఢమార్గవృత్తిఁ జొరక,
పతి కింపు లేనట్టిపనులు మాని,

మఱియు కార్యార్థియై యేగి మరలిరా ము
దమున నెదు రేగి పూజలఁ దన్పి, మధుర
భక్ష్యభోజ్యములను బెట్టి పరమనియతి
సేవఁ జేయుచు మెలఁగుదుఁ జిత్త మలర.

అనవరతము కుటుంబార్థమైన కార్య
మెద్ది యున్న శ్రద్ధ దనరఁ బ్రొద్దు లేచి
స్వయముగా నెఱవేర్చి నిశ్చలముగాఁగ
జీవితపథమ్ము నడిపితిఁ జింత లేక.

పనివడి పాణివల్లభుఁడు
బాల! విదేశము పోయినన్ నిరం
జన నయి, భూషణాదుల వి
సర్జన చేసి, తదాగమాభిలా
షనియత, భక్తి మెండుకొన
శక్త్యనుసారముగాఁ గడున్ మహే
శునిగృహలక్ష్మియౌ గిరిజ
సూటి భజింపుచు నుందు నిచ్చలున్.

# పూ ల మా ల

పతికి నాయాసమున్ కుటుంబమును గూర్చి
కల్లజేయక, నిద్ర భంగ మ్మొనర్పఁ
బోక, సతతమ్ము నా గృహమునను గుప్త
ముగఁ జరించుచునుందును మోద మొప్ప.

సత మరుంధతీముఖపుణ్యసాధ్వు లెలమి
నిట్టి ధర్మంబె పాలించి యింపు గులుక
నమరపథ మాక్రమించిరి; అటులె నేను
వారిజాడనె పోయితి వారిజాక్షి !

స్త్రీల కిదె ధర్మ మంచును జెప్పి చెప్పి
సుమన యనుమతింజేసి విస్ఫూర్తితోడ
సూర్యచంద్రాదిలోకముల్ సొరిది దాటి
స్వేచ్ఛ నేగ శాండిలి తపస్వి వెలుంగ.

## పతిసందర్శనము

ద్యూతమున రాజ్యము దొఱంగి దుఃఖమునను
పాండవులు మానివృత్తితోఁ బరమనియతి
గహనవాస మొనర్చెడికాలమందు
తతమహాతపశ్శాలి యగు ధౌమ్యమౌని.
శతకుంభం బనుయజ్ఞము
నతిమోదంబునను జేయ నారంభవ్యా
వృతదీక్ష గలిగి యుచితా
ర్హత పాండుసుతులఁగూడ రయమునఁ బిలిచెన్.

పిలిచినంతనె వేవచ్చి భీమసేను
యాగసంరక్షణార్థమై యచట నిలిపి
మిగిలినటువంటివా రెల్ల నాగిని లోని
కేగిరి ముదితహృదయపంకేజు లగుచు.

వ్యాయామార్థము భీముఁడు
ఆ యాశ్రమముదరి విపుల మగు బయలునకుఁ
పాయక నేగుట వాడుక
మై యుండుట నొక్కనాఁడు నటు లున్నతఱిన్.

# పూలమాల

కఠినదరిద్రాగ్ని గాసిల్లు కేశవ
దాసను నుత్తమభూసురుండు
తన మిత్రునింట నుపనయనపుణ్య ము
హూర్తమునకును నాహూతుఁడగుట
సకుటుంబముగను దత్పాండ్రిమహాటవీ
పూర్వమార్గముఁ బట్టి పోవుచుండ
నుపవాసగతభుక్తి కొక్కమనుజుఁ గోని
పోవగ తల్లిచేఁ బొందుగాను
అచట నాజ్ఞప్తుఁడై ఘటోత్కచుఁడు చాల
కాల మందందుఁ దిరిగి యక్కానలోన
తుదకు నీబ్రాహ్మణునిఁ గాంచి ముదముతోడ
పొంచి పట్టుకొనంగ నుంకించుచున్న.

అరయ సవత్సధేను వయి
యాకొనియున్న మృగేంద్రముంగలన్
దొరలుచు బడ్డయెద్దువలె
తొట్రు భయాకులచిత్తవృత్తితోఁ

జరణము లె త్తఁజాలక వి
చారముచేత విలోచనంబులన్
బారిపారి యశ్రువుల్ వెడలఁ
బోడిమి దక్క కనెఁ ఘటోత్కచున్.

తల్లియాజ్ఞచే ఘోరకృత్యంబొనర్పఁ
బూనిన ఘటోత్కచుండు విస్ఫూర్తి మెఱయ
సహృదయార్ద్రచిత్తుఁడై సరసగీతి
గుట్టు విడిచి యప్పాఱున కిట్టు లనియె.

"మీలో నొక్కరి నిచ్చినఁ
జాలెడి నవశిష్టు లెల్ల, సంతోషముతో
హేలాగతిఁ బోనయ్యెడు
నాలాగునఁ గానియెడల నందరి కెగ్గా.

అన విని బ్రాహ్మణుం డందు నెవ్వరిఁగూడ
నిచ్చుట కాదట నిష్టపడక
తా ఘటోత్కచుపట్టుదలఁ గాంచి మిక్కిలి
భయ మొందుచుండిన భార్యతోడ

'భయ మేల మన కింకఁ బాండవు లిట దరిఁ
గల' రని ధైర్యంబుఁ గఱపుచున్న
'నయ్యో! వా రిప్పుడే యలధార్మ్యులనివాస
వని కేగి' రని యొక్క వటువు చెప్పె
ననుచుఁ దన పెద్దకొమరుండు పనవి పనవి
యేడ్చుచుండఁ జేయుపని యిం కేమి లేమి
తుదకు తన వృద్ధజీవముల్ తోడరనీయ
సంచలింపక యెద నిశ్చయించె నంత.

'మతి పతివ్రత యన పతిమాత్ర ధర్మిణి
కాన నాయుసువులు వీని కిడుదు
సు'మ్మని బ్రాహ్మణి సూటిగా నన, జ్యేష్ఠుఁ
డపుడు 'నాప్రాణమ్ము లిపుడె యిచ్చి
గురుల రక్షించెద కొమరు మిగుల' ననె,
నట తక్కునిరువురు నటులె యనుచు
ఘోరసంవాదముల్ వా రొనర్చుచునుండ
'జ్యేష్ఠుఁ డెల్లపుడు నా కిష్టుఁ' డనుచు

వృద్ధుఁ డాలింగన మొనర్చెఁ బెద్దవాని
వేగ బ్రాహ్మణియు 'కనిష్ఠ విడువఁజాల'
ననుచు కౌఁగిలించుకొనె; దుఃఖాబ్ధి మునిఁగి
చటులదీనత మధ్యముం డటమటించె.

'మా తాపితరులఁ జేరక
యీ తీరున నైతి; నేఁ కిష్టుఁడనా?' యనన్
'భీతిలకుము నా కిష్టుఁడ
వో తండ్రీ!' యనియె నసురుఁ డొప్పుగ నంతన్.

అంతట మధ్యముండు పల
లాశను వెంబడిఁ బోవనెంచి ని
శ్చింతతఁ దల్లిదండ్రులకు
శీఘ్రమె మ్రొక్కి తదాశిషాళి నా
ద్యంతము నొంది రక్కసుని
యాజ్ఞ దురంతపిపాసఁ దీర్పఁగా
ప్రాంతజలాశయంబునకుఁ
బర్వున నేగి బిరాన రాఁబ్చేన్.

'ఓమధ్యమా! మధ్యమా! మధ్యమా!' యని
గట్టిగా నలిగి రక్కసుఁడు పిలువ

వ్యాయామమును జేయు వాయుపుత్త్రుం డంత
'వత్తు నోహో' యంచు వచ్చుచుండ

'నే మధ్యమునిఁ బిల్వ నీతఁ డెవ్వఁడో వచ్చె'
నని వెండి 'మధ్యమా!' యనె నసురుఁడు

భీముఁ డంతట 'నోయి! నే మధ్యముఁడ' ననె
మండిపడుచు వాఁడు, 'మధ్యముఁడవె?'

అన, 'నవధ్యులలోన మధ్యముఁడ గొప్ప,
శక్తులఁ మధ్యముఁడ, నిల సర్వకార్య
ములను మధ్యముఁడను, పంచభూతములను
మధ్యముఁడ, భ్రాతలంగూడ మధ్యముఁడను.

అనిన భీముఁగా నావృద్ధుఁ డటఁ దలంచె
నంత బ్రాహ్మణమధ్యముం డటకు వచ్చె
నతని గొనిపోవుచుండినయసురుఁ గాంచి
నరవి భీముని వృద్ధుండు శరణు జొచ్చె.

శరణ మొసంగి పాఱునకుఁ
జయ్యన రక్కసుఁ బిల్చి వాని స
ద్వారకులగోత్రకార్యముల
తథ్య మెఱింగి హిడింబిపుత్త్రుఁగా
నెఱిఁగియుఁ దన్ను వాకొన కి
దేమిటి బాలుఁ డవధ్యుఁ డేను స
త్వరమున వత్తు నం చనిన
వాయుజుమాటలు నమ్మి బాలునిన్.

విడిచి 'వే నావెనువెంట ర' మ్మను పలా
శిని గాంచి భీముడు చిఱునగవున
'నతివీర్యబలుని నే ననుసరింప' నటన్న
'ననుఁ జూచినట్లుంటి' వనె పలాశి
'నాపుత్త్రుఁడ వటంచు నయమునఁ బల్కితి'
'యేమి? నీసుతుఁడనా? యేటిమాట?'
లని కోపమునఁ బల్కె 'జనులు రాజులకుఁ బు
త్త్రు లగుట నటు లంటి, నలుక యేల?'

యనియె మారుతి, దానవుం డంత 'పొల్లు
మాటలిం కేల? నాతోడ మఱలిరాక
యున్న భయ ముపదేశించుచుంటి' వనుచు
కాచుకొమ్మని తనయుగ్రఖడ్గ మెత్తె.

'నాదు దక్షిణబాహువే నాకు శస్త్ర'
మనిన, 'నాతండ్రికిం దక్క నరయగు నిట్టి
పల్కు లేరికిం దగ' వని బహువిధాల
నెంచి కోపాన మిగుల ఘోషించుచుండ.

'ఎవరయా నీతండ్రి! యెఱిగింపు, శక్రుండా?
శంభుండా? కృష్ణుండా? శక్తిధరుండ?
యముండా? మఱియు వీరి కర్మిలిచుట్టమా?
సముండా?' యని పరిహాస మ్మొనర్చి
పలుకుభీమునిం జూచి 'తులువా! వదరె' దంచు
క్రుద్ధుండై యుద్ధసన్నద్ధుం డయ్యె
నాతని నెదిరింప నాలస్య మగునంచు
దితిజుండు మిగులం బ్రార్థించి భీము

నింటికిని దోడుకొనిపోయి హృష్టమతిని
దల్లికిని మ్రొక్కి 'అమ్మరో! బల్లిదుం డగు

# పూలమాల

మనుజుఁ దెచ్చితి ర' మ్మన దనుజకాంత
వేడ్కమై నాతనిం జంప వెలికి వచ్చె.

వచ్చి వృకోదరుం గని గు
భాలున తత్పదపద్మయుగ్మమం
దచ్చపుభక్తి వ్రాలి నయ
నాంబుజముల్ వికసింప పుత్త్రితోఁ
'దెచ్చితి నంటి వీతనిన?
దేవుఁడు నీకును నా' కటంచు వా
క్రుచ్చి 'కుమార! నీ జనకుఁ
గూరిమిపూజలు సల్పు' మం చనెన్.

దిగ్భ్రమం జెంది కాళ్ళపై దిగ్గునఁ బడి
'కరుణ రక్షింపు'మను ఘటోత్కచకుమారుఁ
గౌఁగిలించి ముద్దాడుచు కౌతుకాన
దీవనల నిడి ప్రణయసందీప్తి మెఱయ
వారి వీడ్కొని క్రమ్మర వచ్చె భీముఁ
డాశ్రమమునకు సంతోష మావహిల్ల.

## ఆంధ్రభూమి

ఎంద ఱెందరో ఘనసుధాస్యందిలేఖి
నుల తెనుఁగుసీమ ధనధాన్యనిలయ మనుచు
వ్రాసిరే కాని ; నేఁ డది వ్యర్థ మయ్యె!
కడుపు కాలెడివారలఁ గాంచుకతన.

ఎంద ఱెందరో రుధిరనిష్యందిలేఖి
నుల తెనుఁగుసీమ యోధసంకలిత మనుచు
వ్రాసిరే కాని; నేఁ డది వ్యర్థమయ్యె!
వీరుఁ డొకఁడును గనరానికారణమున.

ఎంద ఱెందరో వర మధుస్యందిలేఖి
నుల తెనుఁగుసీమ ప్రణయమండల మటంచు
వ్రాసిరే కాని; నేఁ డది వ్యర్థ మయ్యె!
ప్రణయతత్త్వమ్ము తెలియని ప్రకృతి యగుట.

## స్వస్తి

కెరలి వానలు కాలానఁ గురియుఁగాక !
అవని సస్యసమృద్ధమై యలరుఁగాక !
దుఃఖమే లేక లోకంబు తొరలుఁగాక !
వెఱ పెఱుంగక బ్రాహ్మ్యంబు వెలయుఁగాక !
నిర్ధనుఁడు ధనాధిపుఁ డయి నెగడుఁగాక !
ప్రకృతి సర్వమ్ము నమృతమై బ్రతుకుఁగాక !